


# హస్తామలక స్తోత్రము–2

నాహం మనుష్యో నచ దేవ యక్షౌ
న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః
న బ్రహ్మచారీ న గృహీ వనస్థో
భిక్షుర్న చాహం నిజబోధ రూపః॥

"నేను మనుష్యుడను కాను, దేవతను కాను, యక్షుడను కాను, బ్రాహ్మణుడను కాను, క్షత్రియుడను కాను, వైశ్యుడను కాను, శూద్రుడను కాను, బ్రహ్మచారిని కాను, గృహస్థుడను కాను, వానప్రస్థుడను కాను, సన్న్యాసిని కాను, చిద్రూప ఆత్మస్వరూపుడనే నేను".

వ్యాఖ్య :– నీ వెవరవని శంకరాచార్యులవారు హస్తామలకుడను బాలుని ప్రశ్నింప అతడొసంగిన గంభీరమైన ప్రత్యుత్తరమే ఇది. తాను ఉపాధిని కాదనియు, తాను నిత్య శుద్ధ బుద్ధ ముక్త ఆత్మయేయనియు అతడు జవాబిచ్చెను. తాను జడస్వరూపము కాదనియు, పాంచభౌతికమగు దేహము కాదనియు, కేవలము చిన్మయమగు ఆత్మయేయనియు అతడు ప్రత్యుత్తరమిచ్చెను. బహుజన్మ సుకృతముచేగాని, బహుజన్మ కృతసాధనలచేగాని చిన్నకాలముననే ఇట్టి దివ్యానుభూతి కలుగదు. వాస్తవముగ మానవుడు దేహి యగు ఆత్మయే కాని దేహము కాదు. దేహసాక్షియగు చిదాత్మయే అతడు.










సంపుటము : 24 డిశంబరు 1992 సంచిక 12

## సంపాదకవర్గము

గౌరవ సంపాదకులు :

డా॥ రావుల సూర్యనారాయణమూర్తి M.A.,D.Litt. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య M. A.

సంపాదకులు : బి. ఈశ్వర్

సహాయ సంపాదకులు : బోధచైతన్య, M.A. ఓంప్రకాశ్ B.Sc.

**సంవత్సర చందా : రూ. 30/-లు**

పంపవలసిన అడ్రసు : మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పి.బి.నెం.323, విజయవాడ-520 002
ఫోన్స్ : 61862, 64017, 72433
Telex : 0475 362 ANIL Fax : 0866-63017

**శాశ్వత చందా : రూ. 300/-లు.**

పంపవలసిన అడ్రసు : 'వేదాంతభేరి శాశ్వతనిధి'
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము
పోస్టు, శ్రీకాళహస్తి-517 640
ఫోన్స్: 2239,2543 STD Code 085 78

చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.

# వేదాంతభేరి

**అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక**

**BE FEARLESS : నిర్భయులై యుండుడు!**

## విషయసూచిక



**: ముఖచిత్రము :**

నీ లీలలతో గోకులాన్ని మరిపించి, అల్లరితో అమ్మని మురిపించిన బాలకృష్ణా! వేదవేదాంత సారాన్ని గీతామృతంగా అందించిన జగద్గురూ! మా బుద్ధిని ప్రేరేపించు, మా జీవిత రథానికి సారథివై నడిపించు.



# దైవ ప్రార్థన

ఓమ్ తేజోఽసి తేజో మయి దేహి
ఓమ్ వీర్యమసి వీర్యం మయి దేహి
ఓమ్ బలమసి బలం మయి దేహి
ఓమ్ ఓజోఽసి ఓజో మయి దేహి
ఓమ్ మన్యురసి మన్యుం మయి దేహి
ఓమ్ సహోఽసి సహో మయి దేహి.

(యజుర్వేదం 19–9)

ఓ పరమాత్మా! మీరు తేజోవంతులు. నాకు తేజమును ప్రసాదింపుడు. మీరు వీర్యవంతులు. నాకు వీర్యమును ప్రసాదింపుడు. మీరు బలవంతులు. నాకు బలమును ప్రసాదింపుడు. మీరు శక్తివంతులు. నాకు శక్తిని ప్రసాదింపుడు. మీరు కృపాస్వరూపులు. నాకు కృపను దయచేయుడు. మీరు సహనశీలురు. నాకు సహనమును దయచేయుడు.



# వివేకానంద శంఖారావము

**B**y practice the screen of death will vanish and you will become the inheritors of the wondrous realm of immortality.

(సాధనచే) మృత్యువను తెర తొలగిపోవును. మీరు ఆశ్చర్యకరమగు శాశ్వత ఆత్మ సామ్రాజ్యమునకు అధిపతులు కాగలరు.

ఓం

వేదాంత భేరి



# ఓంకార జెండా

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



ఒక్కొక్క దేశమునకును, ఒక్కొక్క ప్రభుత్వమునకును ఆయా దేశవాసుల సిద్ధాంత, స్వభావ, లక్ష్యములను ప్రతి బింబించు పతాకము (జెండా) ఒకటి యుండును. అట్లే పరమార్థ క్షేత్రమున యత్నశీలురగు ముముక్షు జనులందఱికిని ఒకానొక పతాకము కలదు. అదియే ప్రణవ పతాకము. దానిని ముందిడుకొని, దానిని గౌరవించి, దానిని పూజించి, దానికి మోకరిల్లి సాధకులు అధ్యాత్మరంగమున ముందునకు పయనమైపోవుచుందురు. పరబ్రహ్మ సాక్షాత్కారమను గమ్యమును చేరుటకై వారా ప్రణవపతాకమును చేబూని, అహర్నిశము గమనము సల్పుచుందురు. ప్రణవధ్యానము, ప్రణవోచ్చారణము, ప్రణవార్థ శ్రవణము– ఇవియే వారి నిత్యక్రియలు.

సైనికునకు పతాకము ప్రాణతుల్యమైనది. దానికి అగౌరవము జరిగినచో ప్రాణములనైనను ఒడ్డి అద్దాని పరువుప్రతిష్ఠలను కాపాడును. అట్లే పరమార్థసాధకునకు ప్రణవపతాకము ప్రియతమమైనది. గమ్యమును

నిరంతరము స్ఫురింపజేయుటవలనను, దర్శకుల హృదయసీమలలో అనవరతము ధైర్యోత్సాహములను పురికొల్పుటవలనను, ఆ ప్రణవ పతాకము సాధకులకు పరమవంద్యమై యలరారుచున్నది.

ప్రణవమనగా ఓంకారము, ఓంకారము పరబ్రహ్మము యొక్క వాచకము; నామధేయము. నామోచ్చారణముచే నామియొక్క స్వరూప స్వభావములెల్ల చిత్తఫలకమున నెట్లు ద్యోతకములగునో, అట్లే ప్రణవో చ్చారణముచే ప్రణవవాచ్యమగు పరమాత్మ సాధకుల హృదయకుహరమున స్ఫురించుచుండును. కావున అట్టి ప్రణవరూప పవిత్ర చిహ్నముతోగూడిన పతాకము ముముక్షు లోకమున కత్యాదరణీయమై యొప్పుచున్నది.

మంత్రములలోకెల్ల ప్రణవము (ఓంకారము) అతిముఖ్యమైనది. అది ప్రాణతుల్యమైనది. ప్రణవముతో జేరినపుడే, తక్కిన మంత్రము లకు చైతన్యము కలుగుచుండును. వేదములు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణేతిహాసములు, వెయ్యేల సమస్త శాస్త్రములు ప్రణవము యొక్క మహత్తరశక్తిని వేనోళ్ల శ్లాఘించుచున్నవి. ఉచ్చారణ మాత్రముచే నది మానవుని పునీతమొనర్చుచున్నది. అర్థమననముచే మోక్షమును ప్రసా దించుచున్నది.

"ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్".

అని ఉపనిషద్వాక్యము. సాధకుడు ప్రణవమను ధనుస్సును ధరించి, చిత్తమను బాణమును దానియందనుసంధించి, ఏకాగ్రతతోగూడి, ఆ చిత్తరూప బాణమును బ్రహ్మమను లక్ష్యముయొద్దకు జేర్చవలయును. 'అప్రమత్తేన' (సోమరితనము లేక) అని చెప్పుటవలన భగవచ్చింతనాపరుడు, ప్రణవధ్యానతత్పరుడు బహుజాగరూకుడై, దృశ్యసంకల్పములెవ్వియు లేక, ఏకాగ్రచిత్తము గలిగియుండవలెనని స్పష్టమగుచున్నది. ఏలయనిన

చిత్తము విక్షేపముతో గూడియుండినచో, బహిర్ముఖవృత్తులందు చరించు చుండినచో, బ్రహ్మధ్యానము సరిగా జరుగదు.

కావున విక్షేపరహితమగు చిత్తముగలవాడై సాధకుడు ప్రణవమును ఊతగా గైకొని తద్వాచ్యమగు పరబ్రహ్మమును సతతము ధ్యానించుచు, భ్రమరకీటన్యాయమువగిది, తదాకారాకారితుడై, దైవమయుడై చెన్నొంద వలెను. ఇదియే ప్రణవధ్యాన ఫలము. అయితే,

'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్'

అని గీతయందు భగవానుడు హెచ్చరించుటవలన ప్రణవము (ఓంకారము) యొక్క ఉచ్చారణ మాత్రము చాలదనియు, దాని భావమును గూడ (లక్ష్యార్థమగు పరబ్రహ్మమును) హృదయమున మఱల మఱల చింతన జేయవలెననియు స్పష్టమగుచున్నది.

మంత్రమును మాత్రముచ్చరించి మంత్రార్థమును భావించనిచో ఆ మంత్రమువలన పూర్ణఫలము కలుగనేరదు. ఫిరంగిలో మందు మాత్రము కూరి గుండులేక కాల్చినచో శబ్దమువచ్చునే కాని లక్ష్యమునది భేదింపదు. అట్లే ప్రణవమును అర్థయుక్తముగ ధ్యానమును చేసిననే బ్రహ్మమను లక్ష్యమునది చేర్చగలదు.

అయితే ప్రణవార్థమేమి? దీని నొకింత తెలిసికొనవలసియున్నది. 'ఓమ్' అను శబ్దము 'అ'కార 'ఉ'కార 'మ'కారములను శబ్దముల సంయోగముచే (అ+ఉ+మ) ఏర్పడినది. జాగ్రత్స్వప్న సుషుప్తులు, భూత భవిష్యద్వర్తమానములు, విశ్వతైజస ప్రాజ్ఞులు, సత్త్వరజస్తమోగుణములు మున్నగువానిని (దృశ్యజగత్తును) ఆ అకార, ఉకార, మకారములు సూచించును.

ఆ దృశ్యజగత్తంతటిలోను అనుస్యూతమై వ్యాపించి, దానికాధార భూతమై, దాని కతీతముగ అర్ధమాత్రాస్వరూపమై సర్వసాక్షియై విలసిల్లు

పరమాత్మయే తానని సాధకుడు ప్రణవజపము చేయునపుడు భావన చేయవలెను. ప్రణవధ్యాన మనగా నిదియే. ఈ ప్రకారముగ మంత్రార్థమును చక్కగ భావించుచు, ముముక్షువు ఆ ప్రణవరూప దివ్య మంత్ర ప్రభావముచే పునీతుడై, దివ్య తేజోవిలసితుడై, పరమానందమయుడై చెన్నొందును.

ఇట్టి మహోన్నత పరబ్రహ్మరూపలక్ష్యమును సంస్ఫురింపజేయు ప్రణవచిహ్నముతో గూడిన పతాకము (ఓంకార జెండా)ను ధరించి, ముముక్షువు పరమార్థ క్షేత్రమున శీఘ్రముగ పురోగమనము నల్పుచు, మాయారూప శత్రువును నిర్జించి, విజయోత్సాహముతో ఆత్మ సామ్రాజ్యాధిపత్యమును జేబట్టి బ్రహ్మానందమయుడై విలసిల్లవలెను.

ఓమ్ తత్ సత్. ○○

# ఎవరికివారే యమునాతీరే

న పితుః కర్మణా పుత్రః పితా వా పుత్ర కర్మణా
స్వయంకృతేన గచ్ఛన్తి స్వయం బద్ధాః స్వకర్మణా

తండ్రి కర్మ తండ్రి అనుభవించవలసినదే. కుమారుని కర్మ కుమారుడు అనుభవించవలసిందే. ఒకరి కర్మతో ఒకరికి సంబంధములేదు. ఎవరిదారి వారిదే. ఎవరు చేసుకొనినది వారే యనుభవించుదురు. వారి వారి పాపకర్మలచే వారే బద్ధులగుదురు. వారి వారి పుణ్యకర్మచే, వారి వారి దైవ నిష్ఠచే వారే ముక్తులగుదురు.

(తండ్రి కుమారుని యొక్క స్థూలదేహమునకు కారకుడే కాని సూక్ష్మ దేహమునకు కాదు. వారు వారు సంపాదించు హృదయ పవిత్రతను బట్టియే తండ్రికాని, కుమారుడుకాని సత్ఫలితములను బడయుచుందురు. కావున ఎవరికి వారు చక్కగ కృషిచేసి, సాధనయొనర్చి దైవసాన్నిధ్యమును బడయ వలసియున్నారు.)

# గీతామాతకు జోహారులు

శ్రీ జె. మునిరత్నం గారు

దండము గీతామాతా
భండనమున గిరిధరుండు పలికినమాటా
పండిత పూజిత దేవీ
మెండగు సుగుణములతోడ మెలగెడు తల్లీ. 1
సాధులెల్లరు నానందసాగరమున
దేలియాడనమూల్యోపదేశములను
సర్వజనులకొసంగి సచ్ఛాంతిగూర్చు
నీదుఖ్యాతినిబొగడ నేనెంతవాడ. 2
సారహీనమౌ సంసార సాగరమున
దిక్కుగానక నేడ్చెడుదీనకంత
స్వరములన్నియువిని కృష్ణస్వామినిన్ను
నావగా బంపెనన వచ్చినావు తల్లి. 3
భారతంబున శ్రీ భీష్మపర్వమందు
అర్జునుడు బంధువులగూర్చి యంగలార్చి
గాండివము వీడబోయెడు కాలమందు
నెగడినావమ్మ జ్యోతివైనిర్మలముగ. 4
తొలగెన జ్ఞానవృత్తులు దురితములును
తమముబాసెనీ బోధామృతంబుచేత
భవవిముక్తికి చక్కని బాటజూపి
లోకముల నుద్ధరించెడు లోకమాత. 5
వేదగోవునుండి విశ్వంభరుడు హరి
పాలు పితికె జనుల బాగుకొరకు
ఫల్గుణుండు చాల భక్తితో దూడాయె
క్షీరమయితివమ్మ క్షితిని నీవు. 6
ఆదిశేషునకుం బొగడనలవిగాదు
నీదులోకోపకారమ్ము నిక్కముగను
నిన్ను పంపిన హరికిని నీకు గూడ
తెలుపుచుంటి కృతజ్ఞత దివ్యమాత. 7

ధర్మం శరణం గచ్ఛామి

# ఆక్రోశక భారద్వాజుల కథ

శ్రీ బోధచైతన్య గారు

భరద్వాజ గోత్రానికి చెందిన ఇద్దరు సోదరులకి ఆక్రోశకులు అనే విశేషణం వాడుకలోకి వచ్చింది. కోపం వచ్చినప్పుడు ఒళ్ళు మరిచి గట్టిగా అఱుస్తారు గనుక ఆక్రోశకులనే పేరు సంపాయించుకొన్నారు. చిన్న భారద్వాజుని భార్య కూడా ఇంచుమించు ఆ రకమే. ఆమె వాక్కులో పారుష్యమేకాదు అనృతం, పైశున్యం (చాడీలు చెప్పేస్వభావం), అసంబద్ధ ప్రలాపం కూడా చోటుచేసుకొన్నాయి. దానివల్ల ఆమెకు, ఇతరులకి కూడా అశాంతి ఎక్కువయింది.

ఆమె అదృష్టం బాగుండి ఒకనాడు బుద్ధుని ప్రసంగం వినడం జరిగి ఆనాటినుండి తన వాక్కును సంస్కరించుకోవడం అదుపులో పెట్టుకోవడం ప్రారంభించింది. పాత అలవాటు బలం చేత ఆమెకు ఎప్పుడైనా వాక్కు వశం తప్పుతున్నదనిపించిన వెంటనే ఆమె 'నమో తస్స భగవతో అరహతో సమ్మాసమ్ బుద్ధస్స" అని తథాగతుని స్మరించి వాక్కును వశంలోకి తెచ్చుకొనేది.

ఆమె మాటిమాటికి తథాగతుని స్మరించడం చిన్న భారద్వాజుడు సహించలేకపోయాడు. ఎన్ని చెప్పినా భార్య ఆ స్మరణ మానడంలేదు. అతని కసి బుద్ధుని మీదికి మళ్ళింది. కానీ బుద్ధుడు సామాన్యుడు కాదు. కనుక కేవలం కొన్ని వెటకారం ప్రశ్నలు వేసి కసి తీర్చుకొని రావడానికి వేలు వనవిహారానికి పోయాడు.

బుద్ధుని అతడు అడిగిన ప్రశ్న : "సుఖంగా శాంతంగా జీవించాలంటే మనం ఏ పశువును చంపాలో సెలవిస్తారా?" చంపడం అనే పదాన్ని బాగా నొక్కి అడిగాడు.

అంగుళిమాలుడంతటివాణ్ణి పరివర్తనం కావించిన అనుగ్రహ కరుణాదృష్టిని అతనిమీదకు ప్రసరింపజేసి పరమశాంత గంభీరంగా బుద్ధుడు ఇలా సమాధానమిచ్చాడు : "సుఖంగా జీవించాలంటే ముందు వ్యాపాదం (ద్వేషం=Ill will) అనే పశువును చంపవలసి వుంటుంది"

చిన్న భారద్వాజుడు చల్లబడడమే కాదు, పరివర్తనం కూడా చెంది బుద్ధుని శరణుపొంది ఆ పిమ్మట భార్య అనుమతి తీసుకొని భిక్షు సంఘంలో చేరిపోయాడు.

ఈ వార్త విని పెద్ద భారద్వాజుడు మండిపడ్డాడు. కోపంతో ఊగుతూ వేలు వనానికి వెళ్ళి బుద్ధుని అనరాని మాటలతో తిట్టాడు.

అతని తిట్ల చదివింపులు పూర్తయ్యాక తథాగతుడు నిర్వికారంగా మామూలు శాంతస్వరంతో వీసమెత్తు కూడా తగ్గకుండా పెద్ద భారద్వాజుడిని చల్లగా చూస్తూ ఇలా అడిగాడు. "బ్రాహ్మణోత్తమా, నీవు ఒక వస్తువును దానం చేయదలచి ఒకరికి ఇచ్చావనుకో. ఆ వస్తువును అతను పరిగ్రహించకపోతే అది ఎవరికి చెందుతుంది?"

"నాకే చెందుతుంది. అసంబద్ధంగా ఈ ప్రశ్న ఎందుకేశావు?" అని పెద్ద భారద్వాజుడు కోపం తగ్గని స్వరంతో అడిగాడు.

"నీవు ఇంతసేపు ఇక్కడ నాకు తిట్లదానం ఇస్తూ నిలబడ్డావు. నీ తిట్లలో ఒకటి కూడా నా మనస్సును బాధపెట్టడంగానీ, వికారంపాలు చేయడంగానీ, కోపం తెప్పించడంగానీ చేయలేదు. కనుక నేను వాటిని పరిగ్రహించలేదు. నేను పరిగ్రహించని ఆ తిట్లు మరి ఇప్పుడు ఎవరికి చెందుతాయి?" అని ప్రశ్నించాడు ప్రసన్న గంభీరుడైన సుగతుడు.

పెద్ద భారద్వాజునికి కనువిప్పుకావడం మొదలయ్యింది. ఎంత కోపిష్ఠియైనా సంస్కారం వున్నవాడు గనుక వెంటనే తన తప్పిదాన్ని తెలుసుకొని పశ్చాత్తప్తుడై "బుద్ధం శరణం గచ్ఛామి" అని తథాగతుని పాదపద్మాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆ పిమ్మట అతనుకూడా భిక్షుసంఘంలో చేరిపోయాడు.

పరివర్తనకు ముందు నామమాత్ర బ్రాహ్మణులుగా వుండిన భారద్వాజ సోదరులు పరివర్తనం తరువాత నిజమైన బ్రాహ్మణులయ్యారనే విషయాన్ని ధర్మపదం 26వ అధ్యాయమైన బ్రాహ్మణవర్గంలోని కొన్ని శ్లోకాలు తెలుపుతున్నాయి. మచ్చుకు ఒక శ్లోకం చూడండి.

**యస్స రాగోచ దోసోచ మానో మక్ఖోచ పాతితో**
**సాసపోరివ ఆరగ్గా తమహం బ్రూమి బ్రాహ్మణమ్.** -ధర్మపదం 26-25

రంపం కొననుండి ఆవగింజ జారిపోవునట్లుగా ఎవనినుండి రాగము, ద్వేషము, మ్రక్షము తొలగినదో అట్టివానిని నేను బ్రాహ్మణుడని చెప్పుదును.

(మన హితాన్ని కోరిన వ్యక్తి మనం చేసిన తప్పులను ఎత్తి చూపినప్పుడు ఆ తప్పులు అసలు తాను చేయలేదని కప్పిపుచ్చే స్వభావాన్ని మ్రక్షం అంటారు. తప్పును ఒప్పుకొని సరిదిద్దుకొనే మంచి గుణానికి మ్రక్షం ప్రతిబంధకంగా వుంటుంది).

○○

# నామసంకీర్తన



1. జయజయ జననీ జన్మవినాశని
త్రిభువన సుందరి నిత్యనిరంజని
జయజయ జననీ జయ శివరంజని
జయగుణమంజరి కరుణా సాగరి॥

2. రాధారమణ మదనమోహన రాధేగోపాల్
బృందావనచంద్రకృష్ణ రాధేగోపాల్
శ్యామసుందర మదనమోహన రాధేగోపాల్ ॥బృం॥
రాధాలోలామురళీలోలా రాధేగోపాల్ ॥బృం॥
మాధవ శ్రీమన్నారాయణ రాధేగోపాల్ ॥బృం॥

3. బ్రూహి ముకుందేతి । రసనే పాహిముకుందేతి
అక్రూరాప్రియ చక్రధరేతి । హంస నిరంజన కంసహరేతి
రాధారమణా రమ్యగుణేతి । రాజీవాక్షా ఘనశ్యామేతి॥

4. దత్తగురు దత్తగురు దత్తగురు దత్తగురు
అత్రి అనసూయ పుత్ర దత్తగురు దత్తగురు॥ ○○

**You are the embodiment of God. Fill yourselves with the thought of your almightiness, your majesty and your glory.**

**"జీవులారా! మీరు సాక్షాత్ భగవత్స్వరూపులు. మీ యొక్క అఖండశక్తిమత్వము, పరమార్థ గంభీరత్వము, ఆత్మవైభవములను గూర్చిన దివ్యభావములతో మీ హృదయ కుహరములను నింపుకొనుడు!"**

# భాగవత నవనీతము

## యముని ఫర్మానా

అజామిళుని మరణానంతరము యమదూతలాతనిని పట్టి బంధించి యమ లోకమునకు తీసికొనిపోవుచుండగా, దేవదూతలు, సిద్ధులు కొందఱు వచ్చి వాని పాశములను ఛేదించివైచి అజామిళుని విడుదలచేసిన సందర్భములో యమదూత అడిగిన ప్రశ్నకు వారి నాయకుడగు యమధర్మరాజీ ప్రకారము నుడివెనని పూర్వము శ్రీ శుకదేవుడు పరీక్షిత్తునకు తెలియజేసెను.

తే దేవ సిద్ధపరిగీత పవిత్రగాథా
యే సాధవః సమదృశో భగవత్ప్రపన్నాః
తాన్ నోపసీదత హరేర్గ దయాభిగుప్తాన్
నైషాం వయం న చ వయః ప్రభవామ దణ్డే

(భాగవతం-6.3.27)

ఓ దూతలారా! సమదృష్టిగలవారు, భగవంతుని ఆశ్రయించినవారునగు సాధుమహాత్ములు యొక్క పవిత్ర చరిత్రములను దేవతలు, సిద్ధులు కూడ లెస్సగ గానమొనర్చుచుందురు. విష్ణుభగవానుని "గద" వారిని సదా కాపాడుచుండును. అట్టి వారి దగ్గఱకు మీరెన్నటికిని వెళ్లవద్దు (బాధించుటకు). అట్టి పుణ్యాత్ములకు దండన మొసంగగల సామర్థ్యము మనకుగాని, సాక్షాత్ కాలమునకుగాని లేదు! (అయితే 'యమకింకరులమైన మేము ఎవరిచెంతకు వెళ్లవలెను?' అని మీరడిగెద రేమో చెప్పెదను వినుడు-)

జిహ్వా న వక్తి భగవద్గుణ నామధేయం
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిన్దమ్
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాపి

తానానయధ్వమసతోऽకృతవిష్ణుకృత్యాన్

(భాగవతం-6.3.29)

ఎవరి నాలుక భగవంతుని యొక్క గుణములను, నామములను కీర్తింపదో, ఎవరి చిత్తము భగవానుని పాదకమలములను స్మరింపదో, ఎవరి శిరస్సు ఒక్క పర్యాయమైనను శ్రీకృష్ణపరమాత్మకు వంగి నమస్కరింపదో, భగవత్సేవా విముఖులగు అట్టి పాపాత్ములను పట్టి నా కడకు తీసికొనిరండు!!

భాగవతము షష్ఠమస్కంధమునందు మూడవ అధ్యాయమున అజామిళోపాఖ్యాన సందర్భమున జరిగిన యమ, యమదూత సంవాదమున యమధర్మరాజుచే నీ శ్లోకములు చెప్పబడెను. ఈ శ్లోకముల ద్వారా ఈ క్రింది ధర్మరహస్యములు బోధపడుచున్నవి.

1. పుణ్యాత్ముల యొక్క పవిత్రములగు [illegible], స్వర్గలోకములందు దేవ, సిద్ధ, గంధర్వాదులున్ను గానము చేయుచుందురు.

2. భగవంతుని ఆశ్రయించినవారికి ఏ కాలమునందును యమభటులవలన భయము కలుగదు. ఎవరును వారికి చేటు కలిగించజాలరు.

3. విష్ణుభగవానుని 'గద' పుణ్యాత్ములను సర్వదా రక్షించుచు వారికి ఏ బాధ కలుగనీయక కాపాడుచుండును.

4. ఎవరు తమ యొక్క నేత్రాదీంద్రియములను, మనస్సును, దైవకార్యములందును, దైవచింతనయందును వినియోగింపక వ్యర్థమొనర్చుదురో, అసత్కార్యములందు ప్రవర్తింపజేయుదురో అట్టివారు యమదూతలపాశమందు పడి నానా బాధలననుభవింపవలసివచ్చుదురు.

కాబట్టి ప్రతివారును కడుజాగరూకులై తమ జీవితములందేలాటి దుష్ప్రవృత్తులు లేక, సత్సాంగత్యము, సదాచారములు, దైవచింతన, పరోపకారము మున్నగు సద్గుణసంపత్తినలవఱచుకొని, జీవితమును శోభాయమానముగ నొనర్చుకొనవలయును. ఇంతదనుక అనేక జన్మలనుండియు ఇంద్రియములకు, చిత్తమునకు బహిర్ముఖ ప్రాపంచిక విషయవృత్తులనేకములు అలవాటై పోయినవి. భోగవిలాసములనే జీవుడు పరమావధిగ దలంచుచున్నాడు. సర్వశక్తిమంతుడు, దేశకాల క్రియా పరిచ్ఛిన్నుడునగు సర్వేశ్వరుడొకడు కలడని అతడు నమ్ముకున్నాడు. అందువలననే ఇంద్రియములకు కానుపించు ఈ పాంచభౌతిక ప్రపంచమే పరమసత్యమని నమ్మి

దాని వెంట పరుగిడుచు ఆయా ఇంద్రియ సౌఖ్యములననుభవించుచు అదియే సర్వస్వమని యెంచి పరాత్పరుని విస్మరించుచున్నాడు. అట్టివారు దుష్ప్రవృత్తి జనిత పాపములను బడయుటయేకాక, దైవ విస్మరణ రూపమగు పాపమునుగూడ పెంచుకొనుచున్నారు.

మహాత్ములగు సద్గురువుల సాంగత్యముచేతను, శాస్త్ర పరిచయముచేతను పూర్వకాలపు పాత అలవాట్లన్నిటిని మార్చుచేసికొని నూతన దైవప్రపంచమున అడుగిడవలెను. ధర్మమార్గమును జేబట్టవలెను. ఇంద్రియమనంబులను పవిత్రములుగనుంచుకొని ఆత్మానుభూతికై, దైవసాక్షాత్కారమునకై వానిని వినియోగించుచుండవలెను.

లేకున్న అసత్ప్రవర్తనచే, జీవితమందు వాస్తవ సుఖము దూరమగుటవలన, బ్రతుకే భారముగ తోచును. అపార సచ్చిత్సుక సాగరమున నోలలాడవలసిన జీవుడు భవ దుఃఖముచే క్రుంగిపోవుచుండును. అట్టి దౌర్భాగ్య దశ జీవునకేనాటికిన్ని కలుగకుండుటకై యాతడు మహనీయుల సాంగత్యమునవలంబించి, సచ్ఛాస్త్రములను పఠించుచు, విశ్వమందలి శాశ్వత పదార్థమగు భగవంతునియొక్క అస్తిత్వమునందు విశ్వాసముగలవాడై, ప్రవర్తించవలెను. అత్తఱి వానికి యమదూతలవలనగాని, యమునివలనగాని, కర్మదేవతలవలనగాని, లేక, మఱియెవరివలనగాని ఏ హానియు నుండబోదు. భగవంతుని 'గద' వానిని సదా పరిరక్షించుచుండును. కాబట్టి త్వరపడి జీవితమును సన్మార్గయుతముగ గావించుకొనవలెను. క్షణక్షణమును దైవగంధమయముగ నొనర్చుకొనవలెను. గొప్ప పురుషప్రయత్నము నాశ్రయించి బహు జన్మార్జిత పాప వాసనలను, దుస్సంస్కారములను భక్తిజ్ఞాన వైరాగ్య ధ్యానాదులచే సమూలముగ విధ్వంసమొనర్చి, విజ్ఞానమయుడై, ఆత్మ తేజోవిలసితుడై, వర్తించవలెను. జీవుడు శివుడుగ పరిణతినొందవలెను. ఇదియే జీవిత పరమావధి. ఇదియే శుకవాణి!

OO

---

**Devotion towards God increases in the same proportion as attachment towards the sense-objects decreases.**

**దృశ్యపదార్థములందెంతెంత ఆసక్తి తగ్గుచుండునో, దేవుని యందంతంత భక్తి వృద్ధియగుచుండును.**

# శాస్త్రోద్యానవిహారము

అధ్యాత్మశాస్త్రములు అను చక్కని ఉద్యానవనమును చూచుటకై పోవుదము రండు. అదిగో! సుదూరమున ఒక సుందరవృక్షరాజము కనుపించుచున్నది. అదియే "అపరోక్షానుభూతి". దాని చెంతకు వెళ్ళి దాని బోధరూపఫలమును ఆస్వాదించి ఆనందించెదము, రండు!-

## అపరోక్షానుభూతి

దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చిన్తయేత్
విద్వాన్ నిత్యసుఖేతిష్ఠేత్ ధియా చిద్రసపూర్ణయా (అపరోక్షానుభూతి-142)

"ఈ ప్రపంచమంతయు సచ్చిదానందమగు ఆత్మయందు-అద్దమునందు పట్టణమువలె కల్పింపబడియున్నది. కాని అజ్ఞానవశమున జీవుడు ఆ పరమసత్యమును తెలుసుకొనజాలక శరీరము, ఉపాధి, నామరూప ప్రపంచము సత్యమని భావించి బంధమున తగుల్కొనుచున్నాడు. అట్లు చేయక ముముక్షువగువాడు శరీరమును, బుద్ధ్యాది ప్రపంచమునంతను ధ్యానప్రభావముచే స్వస్వరూపమగు ఆత్మయందు లయింపజేసి, ఆత్మమాత్రము శేషించినవాడై, ఆ పరమసుఖస్వరూపమగు ఆత్మయందు నిలుకడ కలిగియుండవలెను"- అని 'అపరోక్షానుభూతి' లోకమునకు చాటుచున్నది.

ఉప్పు కల్లు నీటిలో లయించిపోవును. అట్లే ఈ దృశ్యమునంతను ధ్యానశీలుడు అధిష్ఠానమగు ఆత్మయందు లయింపజేసి ఆత్మమాత్రుడై వెలుగొందవలెను. ఇట్టి స్థితి మొట్టమొదట సాధ్యముకాకపోయినప్పటికిని ప్రయత్నపూర్వకముగ ధ్యానయోగమును, జ్ఞానయోగమును అభ్యసించుటవలన క్రమముగ జీవుడు అట్టి మహోన్నతి స్థితిని తప్పక పొందగలడు. దృశ్యము దృశ్యముగా ఉన్నచో బంధమును, దుఃఖమును కలిగించును. దృశ్యమును ఆత్మగ పరిణతినొందించుకొన్నచో ఆనందమును కలుగజేయును. సాధకుడు ఆచరించవలసిన గొప్ప సాధన ఇదియే. చద్దిమూట నెత్తిమీద పెట్టుకొన్నచో అది బరువుగ ఉండును. దానిని భుజించివైచినచో బరువు పోవుటయేకాక ఆనందము, తృప్తి, బలము కూడ కలుగును. అట్లే జీవుడు గురుసన్నిధియందు ఆత్మజ్ఞానమును బడసి మనస్సును, ఉపాధిని ఆత్మయందు లయింపజేసి బ్రహ్మమాత్రుడై శేషించి పరమానందమొందవలెను.

"అపరోక్షానుభూతి" అను ఈ గ్రంథమును శ్రీ శంకర భగవత్పాదాచార్యుల వారు రచించిరి. జ్ఞానియొక్క దివ్యానుభూతి ఇందు వివరింపబడియున్నది. ○○

# స్తోత్ర కదంబము

## మృత్యుంజయ స్తోత్రము

### శ్రీ మార్కండేయ కృతము

*సంసార సర్పదష్టానాం జంతూనామవివేకినాం*

*చంద్రశేఖర పాదాబ్జ స్మరణం పరమౌషధమ్* 1

సంసారమను సర్పముచే కాటువేయబడిన అజ్ఞానులగు జనులకు పరమశివుని పాదపద్మ స్మరణము దివ్యౌషధమై యున్నది.

*రుద్రం పశుపతిం స్థానం నీలకంఠ ముమాపతిం*

*నమామి శిరసాదేవం కిం నో మృత్యుః కరిష్యతి* 2

రుద్రుడును, పశుపతియు, స్థిరమైనవాడును, నీలకంఠుడును, పార్వతీ పతియు, దేవదేవుడును అగు శివునకు నమస్కరించుచున్నాను. ఇక యమధర్మ రాజు నన్నేమి చేయగలడు?

*నీలకంఠ విరూపాక్షం నిర్మలం నిరుపద్రవం*

*నమామి శిరసాదేవం కిం నో మృత్యుః కరిష్యతి* 3

నీలకంఠుడును, త్రినేత్రుడును, పరిశుద్ధుడును, శాంతి నిలయుడును, దేవ దేవుడనగు శివునకు శిరసా నమస్కరించుచున్నాను. ఇక యమధర్మరాజు నన్నేమి చేయగలడు?

*కాలకంఠం కాలమూర్తిం కాలాగ్నిం కాలనాశనం*

*నమామి శిరసాదేవం కిం నో మృత్యుః కరిష్యతి* 4

నీలకంఠుడును, కాలస్వరూపుడును, ప్రళయకాలమున అగ్నిరూపము ధరించు వాడును, మృత్యువును సంహరించినవాడును, దేవదేవుడునగు శివునకు శిరసా నమస్కరించుచున్నాను. ఇక యమధర్మరాజు నన్నేమి చేయగలడు?

[illegible]

[illegible]

నాశరహితుడును, నిత్యుడును, శాంతుడును, రుద్రాక్షమాలికను ధరించువాడును, హరుడును, దేవదేవుడునగు శివునకు శిరసా నమస్కరించుచున్నాను. ఇక యమధర్మరాజు నన్నేమి చేయగలడు?

ఆనందం పరమం నిత్యం కైవల్య కారణం

నమామి శిరసా దేవం కిం నో మృత్యుః కరిష్యతి 6

ఆనందస్వరూపుడును, నిత్యుడును, ఉత్తముడును, మోక్షపదము నొసంగువాడును దేవదేవుడునగు శివునకు శిరసా నమస్కరించుచున్నాను. ఇక యమధర్మరాజు నన్నేమి చేయగలడు?

దేవ దేవం జగన్నాథం దేవేశం వృషభధ్వజం

నమామి శిరసా దేవం కిం నో మృత్యుః కరిష్యతి 7

దేవదేవుడును, జగత్పతియు, దేవాధిపతియు, వృషభధ్వజుడనగు శివదేవునకు శిరసా నమస్కరించుచున్నాను. ఇక యమధర్మరాజు నన్నేమి చేయగలడు?

స్వర్గాపవర్గ దాతారం సృష్టిస్థిత్యంత కారణం

నమామి శిరసా దేవం కిం నో మృత్యుః కరిష్యతి 8

స్వర్గమును, మోక్షమును ఒసంగువాడును, సృష్టి స్థితిలయములు కావించువాడును, దేవదేవుడునగు శివునకు శిరసా నమస్కరించుచున్నాను. ఇక యమధర్మరాజు నన్నేమి చేయగలడు?

భస్మోద్ధూళిత సర్వాంగం నాగాభరణభూషితం

నమామి శిరసా దేవం కిం నో మృత్యుః కరిష్యతి 9

భస్మోపలిప్తగాత్రుడును, సర్వాలంకార భూషితుడును, దేవదేవుడునగు శివునకు నమస్కరించుచున్నాను. ఇక యమధర్మరాజు నన్నేమి చేయగలడు?

శివేశాన! మహాదేవ! వామదేవ! సదాశివ

కల్పాయుర్దేహి మే పూర్ణం యావదాయురరోగతామ్ 10

శివా! ఈశ్వరా! మహాదేవా! సదాశివా! నాకు యావజ్జీవితము ఆరోగ్యమును, పరిపూర్ణమగు కల్పాయుర్దాయమును ఒసంగుడు.

ఇతి శ్రీ మార్కండేయకృత మృత్యుంజయ స్తోత్రం సంపూర్ణమ్

○○

# శ్రీ తిరువళ్లువరు

1. నిన్నటిదినం వున్న మనిషి ఈ రోజున లేడే! ఈ ప్రపంచములో ఇంతకంటె గొప్ప వింత ఏమి కలదు?
2. నశ్వరములైనవాటిని శాశ్వతములని భ్రమించుటకంటె గొప్ప తప్పిదము మఱియొకటి లేదు.
3. నాలుక స్తంభింపకమునుపే, ఎక్కిళ్లు రాకపూర్వమే సత్కార్యములను చేయుటకు త్వరపడుము.
4. తమ కోరికలను జయించినవారే ముక్తులు. తక్కినవారు బద్ధులు, కోరికలు లేనివారికి దుఃఖమే లేదు. కోరికలు కలిగి విషయములవెంట పరుగిడువారికో కష్టపరంపరలు నిరంతరము వచ్చుచునేయుండును.
5. పరాత్పరుని పాదకమలముల నాశ్రయించినవారి దినములే చెప్పుకొనదగిన దినములు. కావున సర్వకాలసర్వావస్థలయందును పరమాత్మను స్మరించుచుండవలెను.
6. ప్రతిరోజు ఉదయముననే నీకిష్టమైనదగు భగవద్గీతయో, రామాయణమో, భాగవతమో, ఏదియో శ్రద్ధతో చదివిన సంసారసాగరమును సులభముగ దాటివేయగలవు. ○○

## ఓం

చకుముకిరాయి వేయేండ్లు నీటిలోనున్నను నిప్పురాల్చునట్టి దాని గుణమును పోగొట్టుకొననట్లు, భగవదనుగ్రహము సంపాదించిన మానవుడు జన మధ్యములోనున్నను మార్పుజెందడు.

– శ్రీ రామకృష్ణపరమహంస



# కర్తృత్వమును విడనాడవలెను

ఒక పల్లెటూరువాడు ఒకనాడు రైలు ప్రయాణము చేయదలంచెను. ప్రయాణమునకు తేది నిర్ణయించబడెను. దారిలో కావలసిన వస్తువులన్నిటిని మూటకట్టుకొని ఆ మూటను నెత్తిపై పెట్టుకొని రైలు స్టేషనుకు దారిపట్టెను. అది పల్లెటూరు కాబట్టి స్టేషను మూడు మైళ్ళ దూరమున నుండెను. పల్లెటూరువాడు ప్రయాణమును గూర్చిన స్థిర నిశ్చయముతో బయలుదేరి ఆ మూడు మైళ్లు పాదచారియై నడచి తుదకు రైలు స్టేషను చేరుకొనెను. అందఱివలె అతడు కూడ టిక్కెట్టు కొనివైచెను. టిక్కెట్టును భద్రముగా ఉంచుకొని ప్లాటుఫారంపై ఒక గంటసేపు రైలు కొఱకై నిరీక్షించియుండెను.

ఎట్టకేలకు రైలు ప్లాటుఫారంపైకి సకాలమునకు వచ్చెను. ప్రయాణీకులందఱును గబగబ కంపార్టుమెంటులోనికి ప్రవేశించి వారి వారి సామాను సర్దుకొని కూర్చుండిరి. మన పల్లెటూరువాడు కూడ ఒక పెట్టెలో ప్రవేశించి అందఱితోబాటు కూర్చుండెను. అతని నెత్తిపైని మూటను అట్లే ఉంచుకొనెను, దించలేదు. ఏలయనగా అతని మనంబున ఈ ఆలోచన జనించెను-రైలు పెట్టెలో అందఱు పెద్ద పెద్ద పెట్టెలను, సామాగ్రిని ఇప్పటికే ఉంచినారు. ఇక నా మూట కూడ క్రిందకు దించినచో 'రైలుకు బరువు జాస్తి కాగలదు'- ఇట్లు తలంచి ఆ పల్లెటూరువాడు తన మూటను తానే మోసికొనుచు కూర్చుండెను. ఆ వింత చూచి ప్రక్కన కూర్చున్నవారందఱు అతనినిట్లు మందలించిరి-'ఓ పల్లెటూ

రాయనా! నీవెక్కడ పుట్టావు? ఊరిలోనా? అడవిలోనా? నీవు మూట నెత్తిన పెట్టుకున్నా, క్రింద పెట్టినా మూటను మోసేది రైలే. అనవసరముగ దానిని ఎందుకు మోస్తావు? దించి క్రింద పెట్టు'- ప్రయాణీకుల మాటలు విని పల్లెటూరువాడు అట్లే చేసెను.

ఈ విశ్వ బ్రహ్మాండమంతయు ఒక మహత్తర దైవశక్తిచే నడచుచున్నది. సూర్యుడు, చంద్రుడు, గ్రహములు, నక్షత్రములు అన్నియు దైవశక్తితో నడచుచున్నవి. ఇక మధ్యలో జీవునకు కర్తృత్వమేల? అహంభావమేల? ఆ మహత్తర దైవశక్తికి జోహారులర్పించుచు కర్తృత్వరహితుడై, అహంభావ వర్జితుడై జీవుడు వ్యవహరించవలయును. ○○

## తాతగారి దీనావస్థ

వపుః కుబ్జీ భూతం గతి రపి తథా యష్టి శరణా
విశీర్ణా దన్తాలిః శ్రవణవికలం శ్రోత్రయుగలమ్
శిరః శుక్లం చక్షుస్తిమిరపట లైరావృత మహో
మనో మే నిర్లజ్జం తదపి విషయేభ్యః స్పృహయతి.

నడుము వంగిపోయినది. మూడవ కాలు (కఱ్ఱ) చేతికి వచ్చినది. పళ్ళు ఊడిపోయినవి. శ్రవణశక్తి తగ్గిపోయినది. తల నెరిసినది. కంటికి చత్వారము వచ్చినది. చూపు మందగించినది. ఇన్ని అవకతవకలున్నప్పటికిని తాతగారి మనస్సు బిడియములేక విషయభోగములవైపునకే ఎగిరెగిరి పడుచున్నది.

(శరీరము క్షీణించకమునుపే, ఇంద్రియముల పటుత్వము తగ్గక పూర్వమే సర్వేశ్వరుని అనవరతము ధ్యానించుచు ముక్తిమార్గమును జేపట్టుట విజ్ఞుల కర్తవ్యము. శక్తివంతములైన బాల్యయౌవనములందే ఇవ్విషయమున ఎక్కువ కృషి సలుపవలసియున్నది. వార్ధక్యమున పరిస్థితులన్నియు తల్లక్రిందులైపోవును. అపుడు ధ్యానాది సాధనలు చక్కగా జరుగుటకు అవకాశము ఉండదు. కావున దీపమున్నపుడే ఇల్లు చక్కపెట్టుకొనుట శ్రేయస్కరము.)

# పరమార్థ సువర్ణపుష్పాలు

## శ్రీ రామకృష్ణ పరమహంస ఇట్లు చెప్పిరి—

ఒక కొంగ నీటిలో చేపను పట్టుకొనుటకు నెమ్మదిగా ముందుకు నడచుచుండెను. దాని వెనక ఒక వేటగాడు కొంగకు గురిపెట్టుచుండెను. ఈ విషయము తెలియక కొంగ చేపమీదనే దృష్టిని నిలిపి ముందుకు పోవు చుండెను. అవధూత అది గమనించి కొంగను తన గురువుగా స్వీకరించెను. దైవధ్యానము చేయునపుడు ఇతర లోకవ్యవహారములన్నిటిని పూర్తిగా విస్మరించి మనస్సును భగవంతుని చింతించుటయందే లగ్నము చేయవలెను.

2. శరీరము నశ్వరమే అయినను భగవద్భక్తులు దానిని జాగ్రత్తగ తగు రీతిని రక్షించుచుందురు. ఖాళీ పెట్టెను ఎవరు జాగ్రత్తగ కాపాడుకొందురు? బంగారము, ధనము గల పెట్టెను జనులు మిక్కిలి జాగరూకతతో సంరక్షించుచుందురు. అటులనే దేహమందు దైవము నివసించుచుండుటవలన మహాత్ములు అద్దాని రక్షణయందు శ్రద్ధ వహింతురు. అనగా మితాహారము, మితవ్యవహారములను శీలించుచుందురు.

3. చెల్లాచెదురుగా పడిపోయిన నువ్వుల విత్తనములను ఒకచోట ఏరికూర్చుట చాల కష్టముగదా! ఆ ప్రకారముగనే అనేక ప్రాపంచికవిషయములందు ఆసక్తమై యున్న మనస్సును ఏకాగ్రపరచి భగవంతునియందు లగ్నము చేయుట కూడ కష్టసాధ్యమైన విషయము. కాన అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను మనస్సు తన చంచలస్వభావమును వీడి పరమాత్మ ధ్యానమందు నిలకడను పొందును.

4. భగవత్సాక్షాత్కారము నొందిన మహాత్ములు, భక్తులు ప్రపంచ విషయములందు ఆసక్తిని ప్రదర్శింపరు. చీమ పంచదార కుప్పను విడిచి వెలుపలకు రానట్లు వారు ఎల్లప్పుడును దైవసాన్నిధ్యమందే వుండుటకు ఇష్టపడుదురు. నీరసములైన లోకవ్యవహారములందు విరక్తిని కలిగియుందురు.

5. దృశ్యవిషయలోలునకు మోక్షము కలుగవలెనని అతడు మొట్టమొదట సత్యవిచారణ గావించి వైరాగ్యమును చేబట్టవలెను. దృశ్యము నశించిపోవునని, భగవానుడు శాశ్వతుడని తెలుసుకొనవలెను. దైవధ్యానాదులచే వాసనాక్షయము, మనోనాశము కలుగజేసుకొని తత్త్వజ్ఞానము, ఆత్మజ్ఞానమును సంపాదించి అతడు శాశ్వతానందమును అనుభవించగలడు. ○○

సీరియల్

# జనమేజయ మహారాజు – 3

[illegible]

[illegible]

ఈశ్వర్

“ఓ మహారాజా! ఆ పౌరుడు తాను అనుభవించిన విషాదాన్ని నాతో ఇలా చెప్పెను”–అన్నాడు మహామంత్రి.

“ఈ రోజు కట్టెలు కోసం పోయి ఒక అద్భుతమైన, ఆశ్చర్యకరమైన విషయాన్ని చూచాను. ఈ రోజు లేచిన వేళ మంచిది కావుననే నేను తిరిగి రాగలిగాను. తక్షకుని విషాగ్నికి బూడిదనై ఒక మహానుభావుని మంత్రశక్తిచే బ్రతికి బయటపడగలిగాన”న్నాడు ఆ పౌరుడు.

“అడవిలో చాలా దూరం వెళ్ళితిని. ఒకచోట చాలా పెద్ద చెట్టు నాకంట పడినది. దానిపై నేను అధిరోహించి కొమ్మలు నరుకుటకొరకు ఆలోచిస్తున్నాను. ఉన్నట్లుండి నా చూపు క్రిందకు పడింది. ఎక్కడనుంచో ఊడిపడ్డట్టు ఒక బ్రాహ్మణుడు అక్కడ కనుపించాడు. ఎవరి కోసమో ఎదురుచూస్తున్నట్లున్నాయి అతని చూపులు. మరికొద్దిసేపట్లో మరో బ్రాహ్మణుడు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఆ దారిన పోవుచుండెను. ముందుగ చెట్టువద్దకు వచ్చిన బ్రాహ్మణుడు ఆయనకు అడ్డుతగిలి “ఎవరు స్వామీ? మీరు ఎక్కడికి అంతత్వరగా వెళ్ళుచున్నారు” అని అడిగెను.

## కాశ్యపుని వృత్తాంతము

“నా పేరు కాశ్యపుడు. ధర్మాత్ముడయిన మా మహారాజుకు ఒక మునిబాలుని వలన సంక్రమించిన శాపమగు తక్షక విషాగ్నిని ప్రతిఘటించి బ్రహ్మదేవుడు నాకు ప్రసాదించిన సంజీవిని మహామంత్రముతో మహారాజు ప్రాణాలను రక్షించాలని పోతున్నా”నన్నాడు కొత్త బ్రాహ్మణుడు.

“అది నీ వశం కాదు. సామాన్యమైన మంత్ర తంత్రాలకు అప్రతిహతమైన

తక్షకుని విషం విరుగుడు పడదు. వృధాప్రయత్నముతో నవ్వులపాలు పడుటకంటే వచ్చిన దారిన వెళ్ళండి" అన్నాడు మొదటి బ్రాహ్మణుడు.

"మీరు పొరబడుతున్నారు. కాలకూట విషమైనా నా మంత్రప్రభావము ముందు నిస్తేజమై పోతుంది. అల్పమైన తక్షక విషం నాకొక లెక్కకాదు" అన్నాడు రెండవ బ్రాహ్మణుడు.

"అయితే పరిక్షిత్తును బ్రతికిస్తాననే ధైర్యం వుందా?"

"నీకు నేను చెప్పటమెందుకు? రేపు ఈపాటికి అట్టి సంతోషవార్త దేశదేశాల ప్రజలతోపాటు మీరు కూడ స్వయంగా తెలుసుకొంటారు. దయచేసి సెలవివ్వండి. ఇప్పటికే చాలా కాలయాపన జరిగింది. తక్షకుని క్రూరవిషాగ్నినుండి నా సర్వశక్తులను ధారపోసి మహారాజును కాపాడుకోవాలి"-అని ఆ బ్రాహ్మణుడు అడుగు ముందుకు వేయబోగానే-

ఇంతవరకు ప్రశ్నల వర్షం కురిపించిన మొదటి బ్రాహ్మణుడు "ఆగండి. నేను తక్షకుణ్ణి. ఇదిగో ఫలవృక్షములతో కళకళలాడుచున్న ఈ మహావృక్షాన్ని కాటు వేస్తాను. ఒక్క పువ్వు వాడకుండ ఒక్క ఫలం కందిపోకుండా ఈ చెట్టును ఆశ్రయించుకొనియున్న ప్రాణులతోపాటు యథావిధిగా పునరుజ్జీవింపచేయగలరేమో ప్రయత్నించండి. అప్పుడు తేలిపోతుంది మీరు నిజంగా మీ మహారాజును బ్రతికించగలరో లేదో" అంటూ ఆ బ్రాహ్మణుడు ఉన్నట్లుండి భయంకరమైన ఒక పెద్ద పాముగ మారిపోయాడు. అగ్నికణాలు చిమ్ముతున్న నోరు తెరచి నేనున్న చెట్టును కాటువేశాడు. వెంటనే ఆ వృక్షముతోపాటు నేను కూడ విషజ్వాలకు ఆహుతియై పోయాను. మరికొద్దిసేపటికి చెట్టు యథాప్రకారం వుంది. నేను నా స్థానములోనే వున్నాను.

తక్షకుడు మరలా బ్రాహ్మణుడిగా మారి కాశ్యపునితో "స్వామీ, మహాత్మా! ఎదురులేని నా విషాగ్నికి తిరుగువుందని నిరూపించుకొన్నారు. మీ సంజీవని మంత్ర మహిమ అద్భుతమైందని అంగీకరిస్తున్నాను. కాని ఈ చెట్టును బ్రతికించినట్లే పరిక్షిత్తును మాత్రం మీరు బ్రతికించరాదు. అమోఘమైన మునివాక్కు మొక్కపోవడం మంచిదికాదు. ఇదిగో ఈ మణిపూర్ణములైన ధనరాసులను స్వీకరించి మీ ప్రయత్నము విరమించుకోండి" అని తన ప్రభావముతో అప్పటికప్పుడు ధనరాసులను సృష్టించి కాశ్యపుని ముందుంచాడు తక్షకుడు. అని వివరించాడు పౌరుడు.

ఈ విషయము తెలుసుకొన్న వెనువెంటనే తోటి మంత్రులను సమావేశ పరచి కొత్తవారిని ఎవరిని నగరములో ప్రవేశించనీయకూడదని ఉత్తర్వులు చేశాను.

అనుమానితులను నిర్దాక్షిణ్యముగా చెరలో వేయమని రాజభటులకు వివరించాను. నేను క్షణం క్షణం మహారాజు యోగక్షేమాలు విచారించుకుంటూ అన్ని ఏర్పాట్లను పర్యవేక్షణ చేసుకుంటూ ఎలాగైనా ఈ గండంనుండి మా రాజు గారిని రక్షించమని భగవంతుడ్ని ప్రార్థిస్తూ వుండిపోయాను. ప్రొద్దు క్రమముగా పడమటి దిశగా వాలింది. ఏ ఉపద్రవం లేకుండా సాయంకాలం అయింది. ఇక కొద్దిసేపట్లో సూర్యుడు అస్తమించే వేళ సమీపిస్తూ వుండగ భవన సంరక్షణభారాన్ని స్వయంగా పర్యవేక్షించుచున్న తరుణములో రాజుగారి అంగరక్షక భటుడు వచ్చి అత్యవసరంగా పరీక్షిన్మహారాజుగారు రమ్మంటున్నట్లు చెప్పాడు. వెంటనే వడివడిగా రాజుగారి వద్ద కేతెంచితిని.

అప్పటికే అక్కడ పదిమంది బ్రాహ్మణులు నాన్నగారి ముందు ఫలపుష్పాలున్న బంగారు పళ్ళెరాన్ని వుంచుతూ నాకు కనిపించారు. ఆ బ్రాహ్మణులను చూడగనే నాకు అనుమానం కలిగింది. 'ఎవరు మీరు? మాకు తెలియకుండా ఇక్కడికి ఎలా వచ్చారు?' అని గద్దించి అడిగాను. వారు జవాబు చెప్పకుండా మీ నాన్నగారగు పరీక్షిన్మహారాజును చూచి నవ్వారు. నాకు ఇంకా సందేహము కలిగింది. ఈ బ్రాహ్మణులు మీ నాన్నగారికి ఇచ్చిన ఫలాన్ని చూచి ఆయన సంతోషముతో 'మహామంత్రి భగవంతుడు పంపిన దేవదూతలు వీరు. వీరిచ్చిన ఈ ఫలము ఎంత సువాసనతో అందముగ వుందో! చూడుము' అని అంటూండగనే ఫలములో నుండి ఒక పురుగు బయటకు వచ్చి పెద్దదిగా మారుతున్నది. 'మహారాజా! ఇది ఏదో మాయాజాలముగా వుంది. ప్రమాదభూయిష్టంగా వుంది. ఆ పండును విసిరిపారే యండి. వీళ్లను బంధించుటకు అనుమతి యివ్వండి' అని రాజుగారిని ప్రాధేయ పడ్డాను. రాజుగారు అదేదీ వినిపించుకొనక వాళ్ళతో 'మీకేమి కావాలో కోరుకొండి' అనగానే వారు 'మాకు మీ ప్రాణాలు కావాలి మహారాజా!' అన్నారు నరరూపములో వున్న విషసర్పాలు.

## మారువేషంలో తక్షకుడు

'మేము నిజమైన బ్రాహ్మణులం కాము. తక్షకుని ప్రార్థనచే బ్రాహ్మణ రూపం ధరించి అదృశ్యరూపంలో మీ భవనంలో ప్రవేశించిన నాగకుమారులం' అంటూ క్షణాలలో వారు మాయమయిపోయిరి. మరుక్షణం నాన్నగారి చేతుల్లోని పండులో వున్న చిన్న పురుగు పెరిగి పెరిగి తక్షకుడుగ మారి మీ నాన్నగారగు పరీక్షిన్మహా రాజును దారుణంగా కాటువేసి మాయమైపోయెను. వెంటనే నాన్నగారు ఆ విషాగ్నికి మాడిపోయిరి." అని మహామంత్రి జనమేజయ మహారాజుకు వివరించెను.

**(సశేషం)**

# ప్రశ్నోత్తర వేదిక

# సందేహాలు - సమాధానాలు

## డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.

**(తిరుపతి)**

**ప్రశ్న : "నేను దీన్ని సంపాదించాను. ఇంకా ఇంత సంపాదించాలి. నేను వాణ్ణి నాశనం చేశాను. దేవుడూ లేడు, దయ్యం లేదు. నేనే దేవుణ్ణి. మా వంశం చాలా గొప్పది. నాలాంటివాళ్ళెవరున్నారు"ని, సమాజంలో మన చుట్టూ ఎన్నో మాటలు విన వడుతుంటాయి. ఇవి మంచి ఆలోచనలేనా? ఇలా ఆలోచించేవారు ఏ తెగకు చెందుతారు? ఇలాంటి ఆలోచనలుగల వారి ప్రవృత్తులెలా ఉంటాయి?**

**జవాబు :** ఇలా ఆలోచించేవారు ఆసురీ సంపదకు, అంటే రాక్షససంపదకు సంబంధించినవారే. వీరు అహంకారంతో నిండిపోయి "నేనిప్పుడు ఇది సంపాదించాను. నా లక్ష్యం ఇంత సంపాదించడం. అది నెరవేరేవరకు నిద్రపోను. నాకెంత సిరిసంపదలున్నాయో తెలుసా? ఈ సంవత్సరం ఇంకెన్ని లాభాలొ వస్తాయి. ఈ ప్రపంచంలో నన్ను మించిన ధనికుడెవడూ లేడు" అని అనుకుంటూ ఉంటారు. ఇంకొందఱు "వాడు నాతో శత్రుత్వం పెట్టుకొని బ్రతకగలడా? ఇవాళ, వాణ్ణి చంపాను. మిగతా శత్రువులను గూడా చంపిపారేస్తాను. ఈ లోకానికి నేనే రాజును. నాకంటే ఈ లోకంలో సమస్త భోగాలను అనుభవించేవాడింకొకడెవడూ లేడు. నేనెంతో అదృష్టవంతుణ్ణి. సిద్ధపురుషుణ్ణి నేను. నా మాదిరి బలవంతులు గాని, సుఖపురుషులుగాని ఇంకోరు ఎవరూ లేరు" అంటారు. వీరిలో మఱికొందఱు "నేను చాలా సమర్థుణ్ణి. గొప్ప కులంలో పుట్టాను. నాలాంటివాడింకోడెవడైనా ఉన్నాడా? నేను ఎన్నో యజ్ఞయాగాలు, దానాలు చేస్తాను. ఎంతో ఆనందాన్ని

పొందుతాను" అని అనుకుంటూ అజ్ఞానంలో పడి ఉంటారు. ఈ మాయతో వారు ఎన్నో భ్రమలకు లోబడి, మోహపు రంగులవలల్లో చిక్కుకుపోయి, కామోపభోగానుభవంలో ఆసక్తులై, అతిభయంకరమైన నరకకూపంలో పడతారు. హద్దుమీరిన ఆత్మాభిమానంతో, ధన–మదగర్వంతో, ఆడంబరంతో పేరు ప్రతిష్ఠల కోసం ఎన్నో యజ్ఞాలను, పవిత్ర కార్యాలను చేస్తుంటారు. అహంకారంతో, కామ–క్రోధాలతో బలవంతుణ్ణనే గర్వంతో, తమ దేహంలోను, ఇతరుల్లోను అంతర్యామిగా ఉన్న దేవుణ్ణి గుర్తించలేక, అసూయతో ఇతరులను ద్వేషిస్తూ ఉంటారు.

ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ (భగవద్గీత 16-13)

ప్రశ్న : ***దైవద్వేషం, మానవద్వేషం, అహంకారంకలవారి గతి ఏమిటి? వారు ఇలాగే సంసారచక్రంలో తిరుగుతూ ఉండాల్సిందేనా?***

జవాబు : ఇలా రాక్షస సంపదలో పుట్టి, క్రూరులై సంచరించే అలాంటి నరాధములను భగవంతుడు మళ్లా అమంగళకరమైన రాక్షసప్రవృత్తికల జన్మల లోనే పడవేస్తాడు. ఇలాంటి రాక్షస సంపదలో పుట్టి పుట్టి, పెరిగి పెరిగి, మూర్ఖత్వం పెచ్చుపెరిగిపోగా, భగవంతుణ్ణి పొందాలనే ఆలోచనైనా రాక, నికృష్టమైన, నీచజన్మలను పొందుతారు. ఎంతో పుణ్యం చేసి సంపాదించుకున్న మానవజన్మ ప్రయోజనం పొందకుండానే తిరిగి నికృష్టాలైన పశుపక్ష్యాది నీచ జన్మలనెత్తుతారు.

తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు (భగవద్గీత 16-19) OO

---

**Where there is nothing to weaken us there is no death, nor sorrow.**

**ఎచట ఏదియు మనలను దుర్బలులుగ చేయదో, ఎచట మహాధైర్యసంచారముండునో అచట (అట్టి ఆత్మస్థితి యందు) మృత్యువుగాని, దుఃఖముగాని ఉండవు.**

# భగవంతుడ్ని చూద్దాం

## ఓంప్రకాశ్

ప్రపంచం నలుమూలలనుండి భక్తులు బయలుదేరారు, భగవంతుడ్ని చూద్దామని. చివరికి వారంతా వచ్చి ఒక కూడలివద్ద ఆగిపోయారు. ఆ కూడలికి పది దారులున్నాయి. అందులో వారు వచ్చిన దారి వదిలితే, మిగతా తొమ్మిది దారులు కూడా వారికి అగమ్యగోచరాలు. అయితే ఒకటి మాత్రం నిశ్చయంగా తెలుసు. వాటిలో ఒక దారి తప్పకుండా భగవంతుని వద్దకు చేరుస్తుందని. వచ్చిన చిక్కల్లా, అది ఏ దారో ఎవరికీ తెలియదు.

ఆ కూడలిని దాటితే సరి, వెంటనే భగవంతుని దర్శనం–సాక్షాత్కారం–తత్త్వావగాహనం కలుగుతాయి. "కానీ ఎలా దాటాలీ? ఏమీ తెలియకుండా ముందుకు పోవటం దండగకదా! అసలు తాము విన్నట్లు నిజంగానే ఆ కూడలి దాటింతర్వాత భగవంతుడుంటాడో, ఉండడోకదా!"– ఇలాంటి సవాలక్ష విపరీత సందేహాలు వారికి కలిగాయి.

భగవంతుని కూడలి వద్దకు వచ్చేసరికి, వారికి వాహనాలు గట్రా ఏమీ ఉండవన్న గుండెలు పగిలే నిజం తెలిసింది. అదంతా ఓ పెద్ద కీకారణ్యంలాంటి ప్రదేశం. మనుషులు అసలే ఉండరు. వార్తలు చెప్పేవారు దొరకరు. ఎవరికి వారు, ఏమీ తెలియకుండా, సాహసంగా–వివేకంతో, ముందుకు ధైర్యంగా చొచ్చుకుపోవాల్సిందే–వేరు సౌకర్యం లేదు.

అందుకే వారంతా హతాశులై, నిరుత్సాహులైపోయారు. కొంతసేపటికి వారిలో భగవంతుని గూర్చి చర్చ ప్రారంభమయింది–అసలు భగవంతుడు ఈ కూడలి తర్వాత తప్పకుండా ఉన్నాడా–ఇది యధార్థమా లేక భ్రమా?– అన్న విషయాన్ని గూర్చి ముందు చర్చించాలనుకుని, దాన్ని ప్రతిపాదించారు–కాదు, ముందుగా 'భగవంతుడు' అనే పద–పదార్థ చర్చ చేద్దామన్నారు ఒకరు.

ఒక గంట హెూరాహెూరిగా వారంతా తమ గొంతులు చించుకున్నారు.

చివరికి పద-పదార్థ నిర్ణయం చేశారు-భగవంతుడు ఉన్నాడనే అనుకుందాం-అని అనుమాన ప్రమాణంతో సరిపెట్టుకున్నారు. (ప్రత్యక్షప్రమాణం ఉంటే, వారింత దూరం ఎందుకొస్తారూ?)

"ఇక రెండో విషయం. ఈ దారుల సంగతేమిటో తేల్చుకుందాం, పట్టండి" అన్నారు. "ఇవి అసలు దారులే కావు, దారుల్లా కనబడుతున్నాయి. అది మన భ్రమ"-అన్నారు ఒకరు. "అబ్బే,ఇవి నిజంగా దారులే,కాని ప్రయాణంచేసే దారులు(సాధనలు లెండి) కావండి"-అని చెప్పారు మరొకరు. "అసలు ఈ దారులు వాస్తవమేనా లేక అవాస్తవమా? అంతా అరణ్యంలా ఉందే"-అన్నారు మరో తార్కికుడు. "ఆఁఆఁ. అరణ్యంలా ఉందనకండి, అది మన భ్రమ కావచ్చు. ఎందుకంటే ప్రత్యక్షంలో కూడా భ్రమకు తావుంటుందికదా!"అంటూ మరొకరు ముందుకు వంగి మరీ చెప్పారు. ఇక చూడండీ, అక్కడినుండి విపరీతంగా పెరిగిపోయింది ఆ చర్చ-అసలు భ్రమ అంటే ఏమిటీ? ఎన్ని రకాలు? ఇలా అనంతంగా (బహుశ మీరేగనక అక్కడున్నట్లయితే, వారి తలా-తోకా లేని తర్క వితర్కకుతర్క అతర్క-ఎన్ని తర్కాలుంటే అన్నీ విని పిచ్చాసుపత్రికి మీరే స్వయంగా పరిగెత్తి ఉండేవారు. అదృష్టవంతులు కాబట్టి బ్రతికిపోయారు.)

నిజానికి అలాంటి అవస్థకు వారిలో ఒకతను లోనయ్యాడు. అతను కూడా వీరందరితోపాటూ వచ్చినా, నిజానికి వీరిలాంటి ఆశయంతో రాలేదు. భగవత్ సాక్షాత్కారం చేద్దామనే వచ్చాడు. ఎలాగూ వీరంతా వెళుతున్నారుకదా, తానూ వారితో కలిసి వెళదామనుకుని, వీరి వెంట వచ్చాడు.

వారి అల్లరి, గోల, గొడవ విని అతనికి దాదాపు సగం మెదడు ఖరాబయింది. అతను వెంటనే లేచి, తన చేతిసంచీని భుజాన వేసుకుని బయలుదేరాడు అరణ్యం లాంటి ఆ బాటల్లోకి.

వారంతా ఒక్క నిముషం తమ రొదంతా ఆపి, అతనివైపు చాలా వింతగా, విచిత్రంగా చూశారు.

"ఏమిటీ నీ ఉద్దేశం? అత్యంత విలువైన చర్చల మధ్య లేచిపోతావేమిటీ?" అంటూ దబాయించారు.

"మీ చర్చలకూ-మీ తర్కాలకూ-మీ వాదోపవాదాలకూ ఒక దండం. మీ ప్రమాణాలకూ-మీ భ్రమలకూ-మీ వాస్తవాలకూ-మీ యధార్థాలకూ ఒక నమస్కారం.

మీ ప్రశ్నలకూ—మీ వింత విడ్డూర వికృత విశ్లేషణలకూ రాం రాం. మీ ఎడతెగనీ, ఎటూ తేలనీ మాటలన్నింటికీ ఒక్క హరి ఓం. నేను వస్తాను. నా బుద్ధి చెప్పిన దారి వెంట వెళతాను. వెళుతున్నాను" అంటూ వడివడిగా అడుగులు వేశాడు.

అంతా లేచి అతని వద్దకు పరిగెత్తుకుని పోయారు.

"ఏ దారో తేలందే, ఎలా వెళతావూ? అనవసర శ్రమకదా!" అన్నారు కాస్త మెత్తబడి తమలోనుండి ఒకరు వాకౌట్ అవుతున్నారన్న బెంగతో.

"అనవసర శ్రమ ఏమీ కాదులెండి. నేను దారి చివరివరకూ వెళతాను. ఒకవేళ నిజంగా భగవంతుని సాక్షాత్కారం కలుగుతుందనుకోండి! అంతకన్నా కావాల్సిందే ముంటుందీ? లేదా, భగవంతుని సాక్షాత్కారం కలగలేదనుకోండి, అప్పుడూ నాకు లాభమే. ఎందుకంటే-ఈ దారి భగవంతునివద్దకు చేర్చదు. అని నిశ్చయంగా, ప్రత్యక్ష ప్రమాణంగా తెలిసిపోతుంది. అపుడు మరో దారిపట్టి భగవంతుని చేరవచ్చు. ఈ రెండు ఫలితాలు ఎదురైనా సరే, నేను తప్పకుండా మరల తిరిగి వస్తాను" అన్నాడతను.

వారు మరింత ఆశ్చర్యపోయారు.

"మరల ఎందుకు వస్తావు?" అని అడిగారు.

"రెండు కారణాలున్నాయి. భగవంతుని సాక్షాత్కారం కలిగితే, ఆ 'నిజం' మీకందరికీ తెలియచెప్పి, మీ అనవసర ఆందోళనా-ఆయాసాలను దూరంచేయటం ఒకటి. ఇక రెండవది; భగవంతుని సాక్షాత్కారం కాకపోతే, 'ఈ దారి పనికిరాదు, మరొక దారి పట్టవచ్చును' అని నిశ్చయంగా మీకందరికీ చెప్పి, మీ నోటి దురదను తగ్గించటం-కాబట్టి, ఇక వస్తాను రాం. రాం" అంటూ అతను వారినెవర్నీ లెక్కచేయకుండా వెళ్లిపోయాడు భగవంతుని మార్గాన. (అంటే భగవంతుని సాక్షాత్కారానికి సాహసించి ఒక మార్గంలో అడుగుపెట్టాడు. మార్గం అంటే సాధన, కృషి, ప్రయత్నం, పురుష ప్రయత్నం)

వారంతా అతన్ని మూర్ఖునిక్రింద జమకట్టారు; ఎంత అమాయకుడు-అని తమలో తామే నవ్వుకున్నారు.

కాని ఆ వ్యక్తి శ్రద్ధతో దైవమార్గమున పయనించి, సాధనచేసి భగవత్సాక్షాత్కారమును పరమానందమును పొంది ఆ విషయమును ఇతరులకు తెలియజేసి జీవితమును చరితార్థమొనర్చుకొనెను. ○○

# [illegible] వింతలు - విశేషాలు

1. భారతదేశపు స్త్రీలలో ఎక్కువ అక్షరాస్యత కేరళ ప్రాంతమున కలదు.
2. భూమిని చేరుచున్న సౌరశక్తిలో నాల్గవవంతు శక్తి సముద్రపు నీరు ఆవిరి అగుటకు ఉపయోగపడుచున్నది.
3. నెప్ట్యూన్ వ్యాసము 31 వేల మైళ్లు.
4. ప్రతి సంవత్సరము 3 లక్షల 38 వేల ఘన కిలోమీటర్ల సముద్రపు నీరు ఆవిరిగా మారుచున్నది.
5. ఆసియా ఈశాన్య భాగంలో వున్న బ్రూనే దేశములోని రాజభవనము ప్రపంచములోనే చాలా పెద్దది. 300 ఎకరముల అందమైన తోటలో ఆ భవనము 50 ఎకరముల మేర ఆవరించుకొనియున్నది. అందులో 1,800 గదులు కలవు.
6. ఇటలీలోని రోము నగరములో పోపు నివసించు భవనములో 1,400 గదులు కలవు.
7. 8వ ఉపగ్రహము నెప్ట్యూన్ కూడ భూమికంటె పెద్దదే. అది యురేనస్‌కు 100 కోట్ల మైళ్ల దూరమున కలదు. ○○

None is really weak. The Soul is omnipotent and omniscient.

ఎవరును దుర్బలురు కారు, అందరును సర్వశక్తిమయ సర్వజ్ఞ ఆత్మస్వరూపులు.



# వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

యుద్ధమందు విదూరథుడు దేహత్యాగము చేసెను. ఆతని జీవచైతన్యము దేహమును వీడి ఆకాశమార్గము గుండా చనుచుండ ఆ దేవులిరువురును వానిని వెన్నంటిరి. ఆ జీవచైతన్యము వారిని చూడజాలకున్నను వారాతనిని జూచుచుండిరి. ఆతని జీవుడు యమపురికి బోవ నచట యముడాతని కర్మముల విచారించి పాప కర్మమేదియులేదని చెప్పి వానిని వదలి వైచెను.

అపుడా జీవచైతన్యమట నుండి బయలుదేఱి అనేక లోకములను దాటి ఆ బ్రహ్మాండమును వీడి మఱియొక బ్రహ్మాండమున పద్మని యంతఃపురమునం బ్రవేశించెను. అచట పద్మని మృతశరీరమును 2వ. లీలను జూచిరి. 2వ లీల ఆకారాదులందు మొదటి లీలవలెనే యుండెను. అపుడు దేవి విదూరథుని జీవ చైతన్యమును నిరోధించెను.

**లీల :–** పూర్వము సమాధియందున్న నా దేహమేమైనది?

**దేవి :–** 15 దినముల కది జఠరాగ్నిచే తపింపఁబడి తదుపరి నిర్జీవమై పోయెను. అపుడు మంత్రులద్దానిని మృతినొందినదిగ్లైఱింగి చందనాదులచే దహించిరి. పరివారము ఔర్ధ్వదేహిక క్రియలను సల్పెను. పూర్వమిచటికి వచ్చి నేటికి 31వ రోజు.

అపుడు దేవి 'మమ్ములను ఈ(రెండవ) 2వ లీల చూచుగాక' అని సంకల్పిం పగా అట్లే 2వ, లీల వారిని గాంచి ఆనందపరవశయై వారి పాదములపైబడి దేవి కోరిన ప్రకారము తానెట్లు వచ్చినది అంతయు చెప్పెను. అత్తఱి దేవి విదూరథుని జీవుని వదలగా ఆతడు పద్మని మృతశరీరమున బ్రవేశించెను.

రాజు లేచి ఆ ఇరువురు లీలలను జూచి మీరెవరని అడుగ పూర్వలీల తానాతని పూర్వ జన్మమందలి భార్యయనియు, 2వ లీల ఆతని కొఱకై లీలారూపముగ తాను సార్జించిన తన ప్రతిబింబ రూపిణియనియు, మూడవ ఆమె సరస్వతీదేవియనియు

# పరమాత్మ వాక్కులు



1. మనిషి అన్నిటిని గురించి తెలిసికొనును తనను గురించి తప్ప.
2. దీర్ఘజీవితము కాదు దివ్యజీవితము కోరుకొనవలెను.
3. మనిషి నేలను తనదిగా చేసికొనును. నేల మనిషిని తనలో ఇముడ్చుకొనును.
4. నీవు నవ్వినచో ప్రపంచమంతయు నీతో కలిసి నవ్వును.
5. ఇతరులకు మేలు చేయుట నీకు నీవు మేలు చేసికొనుటయే.
6. ఇతరులను జయించువాడు ధీరుడు. తన్ను తాను జయించుకొనువాడు మహనీయుడు.
7. జనులు విషయ సుఖమును వెతకుచు స్వేచ్ఛను పారవేసుకొనుచున్నారు. అట్లు చేయరాదు. ○○

చెప్ప, రాజు దేవికి నమస్కరించి జ్ఞానము, దీర్ఘాయువు, ధనము తన కొసంగునట్లు ప్రార్థింప దేవి తన హస్తములతో నాతనిని స్పృశించి "అట్లే యొసంగితి"నని చెప్పి ఆత్మజ్ఞానియై తాను సుఖముగ రాజ్యమేలుమని ఆశీర్వదించి అంతర్ధానమయ్యెను. పిమ్మట రాజునకు రాజ్యాభిషేకముకాగా ప్రజలందరును సంతోషముతో ఆనందోత్సవము జరిపిరి. వారు మువ్వురును సుఖముగ నున్నవారై జీవన్ముక్తులై వెలసిరి. ఇట్లా రాజు 80 వేల సంవత్సరములు రాజ్యమేల ఆ పిదప మువ్వురును విదేహముక్తి నొందిరి.

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ ఈ లీలోపాఖ్యానముద్వారా దృశ్యముయొక్క మిథ్యాత్వమును, ఆత్మయొక్క సత్యత్వమును నెఱుగుము. ఏ పదార్థమునందు అధికమగు అభిలాష గలదో దానిని త్యజించినచో ముక్తి లభించినట్లే. చిత్తము వాసనా రహితమై దృశ్యము వైపునుండి మరలి ఆత్మవైపున కెపుడేతెంచునో అపుడే సంసార దుఃఖము నశించి ఆత్మసాక్షాత్కార ముదయించును. ○○

# వినోదము-వికాసము

## భక్తిలో తన్మయత్వం

పూర్వం కులశేఖరుడనే రాజు వుండేవాడు. అతడు గొప్ప విష్ణు భక్తుడు. నిరంతరం నారాయణమూర్తిని స్మరిస్తూంటాడు. భక్తిలో తన్మయత్వం పొందుతూంటాడు. అతడు వ్రాసిన "ముకుందమాల" అనే పుస్తకం ఆధ్యాత్మలోకమున గొప్ప విఖ్యాతి పొందింది. అంతా విష్ణుమయంగా అతనికి తోస్తుంది. భగవన్నామ స్మరణ చేయని జీవితం వృధా అని అతని అభిప్రాయం. అతడు ఎన్నో ధర్మకార్యాలు, దైవ కార్యాలు చేస్తూండేవాడు. అతని ఆస్థానంలో రామాయణ కాలక్షేపం, భాగవత కాలక్షేపం జరిపిస్తూండెడివాడు.

ఒకనాడు తన రాజభవనంలో అనేకమంది భక్తుల సమక్షంలో రామాయణ కాలక్షేపం బ్రహ్మాండంగా జరుగుతూంది. పౌరాణికుడు రామాయణ శ్లోకాలను చదువుతూ, వాటి అర్థాన్ని వివరిస్తూ భక్తులకు చక్కగా బోధిస్తున్నాడు. కులశేఖర మహారాజు ప్రక్కనే కూర్చుండి ఆనందంగా శ్రవణం చేస్తున్నాడు. ఒకరోజు జరిగిన రామాయణ కాలక్షేపంలో రాముని అరణ్యవాస ఘట్టాన్ని గూర్చి పౌరాణికుడు వివరిస్తున్నాడు. సభ్యులందరు ఏకాగ్రంగా వింటున్నారు.

ఆ సందర్భంలో పౌరాణికుడు "14 వేల రాక్షసులతో రాముడు ఏకాకిగ యుద్ధం చేయటం ప్రారంభించాడు" అని చదువగానే తక్షణమే కులశేఖరుడు మంత్రిని పిలిచి "రాముడు ఏకాకిగ యుద్ధం చేస్తున్నారు. మన సైన్యాన్ని కూడ అచ్చటకు రామునకు సహాయంగా పంపండి" అని ఆదేశించాడు.

అపుడు సభ్యుల్లోను, ప్రభుత్వాధికారుల్లోను, సైనికుల్లోను గొప్ప అలజడి, సంచలనం ప్రారంభమైనాయి. అది చూచి పౌరాణికుడు వెంటనే "రాముడు శత్రువులందరిని సంహరించి వేసెను. ఆ దృశ్యం చూచి సీతమ్మ చాల సంతోషించెను" అని చదివాడు.

ఆ మాటలు వినగానే కులశేఖరుడు ఊపిరి పీల్చుకొని, మంత్రిగారిని సైన్యాన్ని

# ఆత్మానుసంధానము

సాధకులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

సర్వం సర్వపదాభాస మనాద్యన్త మనామయమ్
అహం చిదితి జానామి తేన జీవామ్యనామయః.

నానా పదార్థ రూపమున భాసించు ఈ సమస్తమున్ను ఆద్యంతరహితమై, నిర్వికారమైనట్టి చైతన్యమేయనియు, ఆ చైతన్యము నేనేయనియు ఎఱిగి యుండుటవలన సంతాప వర్జితుడనై నేను జీవించుచున్నాను.

(ఇది ఒక జీవన్ముక్తుని అనుభూతి)

---

పంపవద్దని ఆదేశించాడు. సభాభవనంలో సద్దుమణగింది. అందరి మనస్సులు కుదుటపడ్డాయి.

మోక్షప్రాప్తికి దైవభక్తి, దైవధ్యానం అత్యవసరములు. సాధకుడు తన దైవభక్తిని ఎంతెంత పెంచుకొంటాడో దైవానికి అంతంత సన్నిహితుడు ఔతాడు. ప్రతివారు రాముని గాని, కృష్ణుని గాని, శివుని గాని, నారాయణుని గాని, దేవిని గాని ఏకాగ్రచిత్తంతో నిర్మలభక్తితో ధ్యానిస్తూ జీవితాంతం కాకపూర్వమే భగవదనుగ్రహానికి పాత్రులై తత్ఫలితముగ ఆత్మానుభూతిని పొందాలి. ఎవరి ఇష్టదైవాన్ని వారు ఆరాధించుకోవచ్చు. కాని భక్తి, శ్రద్ధ, ఏకాగ్రత, చిత్తశుద్ధి చాల అవసరములు. జీవుడా! పుణ్యకార్యాలు, ధర్మకార్యాలు విరివిగా చేస్తూ దైవభక్తి పరాయణుడవై యుండు. భక్తిలో తన్మయత్వము పొందు. అధిష్ఠానమైన ఆత్మలో మనస్సును లయం చెయ్యి. బ్రహ్మానందాన్ని పొందు. తరించు. జై గురుదేవ్.

(పౌరాణికుడు మొదటిసారి చదివిన శ్లోకం)-
చతుర్దశ సహస్రాణిం రక్షసాం భీమకర్మణాం
ఏకో హి రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి

(పౌరాణికుడు రెండవసారి చదివిన శ్లోకం)-
తం దృష్ట్వా శత్రుహన్తారం మహర్షీణాం సుఖావహం
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే. (రామాయణము)




## నేటి చర్చనీయాంశము – వ్యాధి దుఃఖం

**శిష్యుడు (శివప్రసాద్)**–మహాత్మా! గురుదేవా! ఈ ప్రపంచంలోని ఏయే విషయాలను గూర్చి చింతిస్తే జీవునకు తక్షణమే వైరాగ్యం కలుగుతుందో తమరు సెలవిచ్చియున్నారు. అట్టి వైరాగ్యోత్పాదకములైన 4 దుఃఖాలలో జన్మదుఃఖం, జరాదుఃఖం అను రెండిటిని గూర్చి తమరు విపులంగ బోధించియున్నారు. ఇక మూడవది అయిన వ్యాధి దుఃఖాన్ని గూర్చి సెలవివ్వ ప్రార్థన–

**గురువు (ప్రబోధానందస్వాములవారు)**– నాయనా! శివప్రసాద్! అజ్ఞానవశం చేత జనులు మోహగ్రస్తులై చెడును మంచిగాను, మంచిని చెడుగాను తలుస్తూంటారు. శరీరాన్ని చూచి మురిసిపోతున్న మనుజుడు, ఆ శరీరం యొక్క స్వరూపమెట్టిదో, దానికి భవిష్యత్తులో ఏయే పరిస్థితులు కలుగబోవునో ఊహించలేదని అర్థం. శరీరానికి ఆరోగ్యం ఎపుడూ ఒకే విధంగా వుండదు. కర్మవశాత్తు అది తలక్రిందులౌతూంటూంది. పుణ్యకర్మ వెనుక వున్నచో, అది ఆరోగ్యంగ వర్ధిల్లుతూంటుంది. పాపకర్మ దాపురిస్తే వ్యాధిగ్రస్తమౌతూంటుంది.

"పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే"

(పూర్వజన్మలో చేసిన పాపం ఈ జన్మలో వ్యాధిరూపంగ ప్రాణిని బాధిస్తూంటూంది) అని పెద్దల వాక్యం.

కాబట్టి వ్యాధులు రాకపూర్వమే, శరీరం కృశించకపూర్వమే, చావు సంభవింపక పూర్వమే జీవుడు కడతేరటానికై ప్రయత్నించాలి. అనుభవజ్ఞుడైన గురువు వద్దకు వెళ్ళి "స్వామీ? నేనెవరు? ఈ జగత్తు ఎట్లేతెంచింది? నా గమ్యస్థానమేమిటి? భగవత్సాక్షాత్కారం పొందటానికి మార్గమేమిటి? తరించటానికి నేను ఈ జీవితంలో చేయవలసిన సాధనలేమిటి?"– అని ఈ ప్రకారంగ అడిగి తెలుసుకొని వారు బోధించిన రీతి భక్తి జ్ఞానవైరాగ్యాది సాధనలను తు.చ. తప్పకుండ ఆచరించి తరించాలి.

అట్లు చేయనిచో జీవితం నిరుపయోగమై పోతుంది.

శరీరం ఒక్క మానవుడికే కాదు, ప్రతి ప్రాణికి వుంది. కానీ ఇతర ప్రాణులు పుట్టినపుడు ఎట్లా వుంటాయో చచ్చేటప్పుడు అట్లే వుంటాయి మార్పు ఏమీ వుండదు. అవి కేవలం శరీరమే పరాకాష్ఠ అని తలంచి నిరంతరం దాని ఎడలనే దృష్టి కలిగియుంటాయి. కాని మానవుడు అట్లా కాదు. మానవశరీరంలో దైవానుభూతిని బడయటానికి తగిన వివేకముంది. ఆ వివేకాన్ని ఉపయోగించుకొని జీవితలక్ష్యమైన మోక్షాన్ని, ఆత్మానుభూతిని అతడు సంపాదించాలి. ఈ క్రియలన్నిటిని మనుజుడు ఆరోగ్యంగా వున్నపుడే సాధించాలి. వ్యాధులు మున్నగునవి సంక్రమిస్తే అతడు ఏమీ చేయజాలడు. సమయం వృధా అయిపోతుంది.

"దైవధ్యానంతో నాకిపుడు ఏమి పని? నేను ఆరోగ్యంగా వున్నాను కదా! దేవుని గూర్చి నిదానంగా ఆలోచిస్తాను" అని ఎవరును తలంచరాదు. దుష్కర్మ ఫలితంగా భవిష్యత్తంతయు తారుమారైపోవచ్చును. ఇపుడు వున్న అనుకూల పరిస్థితులు ముమ్ముందు లేకపోవచ్చును. ఇపుడు వున్న ఆరోగ్యం, శరీర సౌష్ఠవం భవిష్యత్తులో అంతర్ధానమై పోవచ్చు. శివప్రసాద్! నీవు కళ్ళారా చూస్తున్నావు కదా! ఒక్కొక్క రోగం వస్తే మానవుడు ఎన్నాళ్ళో బాధపడ్తున్నాడు. టైఫాయిడ్ వస్తే 21 రోజులు తికమకపడ్తూంటాడు. కొన్ని కొన్ని విపరీత జ్వరాలు వస్తే నెలలు పర్యంతము మంచం పట్టుకొని యుంటాడు. ఇక కుష్ఠురోగము మొదలైనవాటిని గూర్చి చెప్పవలసిన పనే లేదు. ఎన్నో బాధలు, ఎన్నో కష్టాలు, ఎన్నో మానసిక ఆందోళనలు- వీటన్నిటికి కారణము పూర్వజన్మ దుష్కర్మయే. కావున పుణ్యమును లెస్సగ సంపాదించి జ్ఞానమును పొంది, జ్ఞానాగ్నిచే కర్మశేషమును దగ్ధమొనర్చి వేయాలి. ఇదే జీవుని కర్తవ్యం. తెలిసిందా!

నాయనా! శివప్రసాద్! శరీరానికి కలుగుచున్న ఈ జన్మజరాది దుఃఖాలను గూర్చి నీవు లెస్సగ విచారించి, అసలు శరీరమే లేకుండ వుంటే జన్మరాహిత్య పదవికై ప్రయత్నించు. దేహసంబంధమగు ఈ దుఃఖాలను పర్యాలోచించి విరక్తిని పొంది శాశ్వతమగు దైవమందే దృష్టిని నిలిపి జన్మను చరితార్థం చేసుకో.

**శిష్యుడు** — మహాత్మా! గురువర్యా! రోగములెంత భయంకరములైనవో, అవి అమూల్యమైన జీవితకాలము నెట్లు వ్యర్థపరచునో తమ బోధలవల్ల ఇపుడు చక్కగ తెలుసుకొన్నాను. వ్యాధులు రాకపూర్వమే, ఆరోగ్యంగా వున్నపుడే, దైవధ్యానాదులు సలిపి తరించటానికి యత్నిస్తాను. దారిచూపే తమరుంటే ఇక నాకేమి కొదువ. దయచూపుడు. సెలవు. OO

| | |
|---|---|
| 11. శ్రీ కె. భక్తవత్సలం చెట్టి గారు, పుత్తూరు | 1,116/- |
| 12. శ్రీ ఎల్. మురళీనాథ్ గారు, తిరుపతి | 516/- |
| 13. శ్రీ సి.ఆర్. రంగనాథం చెట్టి గారు, వెల్లూరు | 250/- |
| 14. శ్రీ కె. కృష్ణయ్య చెట్టి గారు, పుత్తూరు | 1,116/- |
| 15. శ్రీ కె.ఎ. పాండురంగం చెట్టి గారు, తిరుపతి | 1,116/- |
| 16. శ్రీ ఎన్.జె. వేంకటేశ్వర్లు చెట్టి గారు, పుత్తూరు | 516/- |
| 17. శ్రీ జి. శ్రీనివాసులు గారు, వేముల | 1,116/- |
| 18. శ్రీ జె. సంపత్‌కుమార్ గారు, కోయంబత్తూర్ | 525/- |
| 19. శ్రీ జె. కృష్ణయ్య శెట్టి గారు, బెంగుళూరు | 516/- |
| 20. శ్రీ టి. ఆనందమోహన్ గారు, సికింద్రాబాద్ | 1,116/- |
| 21. శ్రీ శివ ఆంజనేయులు గారు, రాజవరం | 500/- |
| 22. శ్రీ వి. అనంతరామయ్య గుప్త గారు, తల్లాడ | 520/- |
| 23. శ్రీ కె.వి. రంగారావు గారు, హైదరాబాద్ | 1,000/- |
| 24. శ్రీ డి. అప్పాకొండయ్య గారు, నంద్యాల | 2,500/- |
| 25. శ్రీ కె. సుబ్బయ్యచెట్టి గారు, కడప | 1,111/- |
| 26. శ్రీ ఎస్.ఆర్. కన్నయ్య గారు, హైదరాబాద్ | 1,120/- |
| 27. శ్రీ కె. కృష్ణమోహన్ గారు, హైదరాబాద్ | 1,116/- |
| 28. శ్రీ టి. వేంకటసుబ్బయ్య గారు, ధర్మవరం | 1,116/- |
| 29. శ్రీ టి.ఆర్. శివప్రసాద్ గారు, విజయవాడ | 500/- |
| 30. శ్రీ కె.బి.ఎస్. ప్రకాశరావు గారు, హైదరాబాద్ | 1,116/- |
| 31. శ్రీ డి. వేంకటరామారావు గారు, ఈదర | 1,000/- |

OO

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada

**Editor : B. ESWAR**

# నారద భక్తి సూత్రములు–83

ఇత్యేవం వదన్తి జనజల్ప నిర్భయా ఏకమతాః
కుమార వ్యాస శుక శాణ్డిల్య గర్గ విష్ణు కౌణ్డిన్య శేష
ఉద్ధవ ఆరుణి బలి హనుమద్ విభీషణాదయో భక్త్యాచార్యాః

తా॥ ఈ ప్రకారముగ భక్తియే సర్వశ్రేష్ఠమైనదని జనుల నిందా స్తుతులకు భయపడనివారును, భక్తి మున్నగువాని విషయములో ఏకాభిప్రాయము కలవారును అగు సనత్కుమారుడు, వ్యాసుడు, శుకుడు, శాండిల్యుడు, గర్గుడు, విష్ణువు (ఒకానొక మహర్షి), కౌండిన్యుడు, శేషుడు, ఉద్ధవుడు, ఆరుణి, బలి, హనుమంతుడు, విభీషణుడు మున్నగు భక్తి సంప్రదాయ ప్రవర్తకులందఱును ఇట్లే భక్తిని గుఱించి (నేను చెప్పిన విధముగనే అది సర్వశ్రేష్ఠమని) వచించుచున్నారు.

వ్యాఖ్య :– ఇంతవరకు భక్తిని గుఱించి 82 సూత్రముల ద్వారా తాను ఏయే విషయములను ప్రతిపాదించెనో, వాటినే పైన తెలిపిన సనత్కుమారవ్యాసాది భక్త్యాచార్యులు కూడ చెప్పుచున్నారని నారదుడు ఈ సూత్రమున తెలుపుచున్నారు.

కాబట్టి ఆ భక్తి విషయములన్నియు ప్రామాణికములనియు, పరమసత్యములనియు విదితమగుచున్నది. పైన పేర్కొనబడిన భక్త్యాచార్యులు జనుల నిందాస్తుతులకు ఏమాత్రము భయపడనివారనియు, దైవతత్త్వము ఎడల ఒకే అభిప్రాయము కలవారనియు ఇచట చెప్పబడినది. నారద సనత్కుమారవ్యాసాదులైన ఈ పరమభక్తులెల్లరు ప్రాతఃస్మరణీయులు, మహాతపస్సంపన్నులు, భక్త శిరోమణులు.